# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర ఆశ్వయుజ బ॥ ౧౧
గురువారము


## రష్యా యుద్ధరంగము.

మూడు మాసాలనుండి జర్మనీకి రష్యాకును జరిగే ఘోర యుద్ధాన్ని మనమందరము గమనించుచునే యున్నాము. రష్యా అనుకోనంతతీవ్రతతో బాగా ప్రతిఘటించుచున్నదని విని సంతోషపడుచుంటిమి. జర్మనులకు తుదకు మంచి ప్రాయశ్చిత్తంచేసే నాథుడు దొరికినట్లు కనబడుచూవచ్చినది. ఈ యుద్ధం చరిత్రలో కనివిననియుద్ధం, ౨౦౦౦ మైళ్ళ పొడవునసాగినది. ఉభయ పక్షాలనుండి ౧ కోటిసైన్యము యుద్ధములో పాల్గొన్నది. ఇంతవరకు జర్మనుల సైన్యములో ౩౦ లక్షల నష్టమొందనివింటిమి. ఇంక టాంకులు, విమానాలు నష్టమైనవన్నీ, పత్రికల ప్రకటితమైనవన్నీ లెక్కించితే సుమారు ౨౦ వేల విమానాలును ౨౦ వేల టాంకులున్నూ నష్టమైనవనవలెను. ఇది సామాన్య నష్టముకాదు. పత్రికా వార్తలలో ఇంచుక ఉత్ప్రేక్షాతిశయోక్త్యలంకారాలుకూడా ఉండవచ్చును. అయిన నష్టము చాలా అయియుండవచ్చునన్నమాట విశ్వసింప వచ్చును. అయితే రష్యావారికిన్నీ నష్టాలుకలిగిఉంటవి. రష్యాపక్షాన చెప్పినవార్తలనుబట్టి జర్మనులకు చాలా నష్టాలు కలిగినవని నమ్మినాముకదా మరి జర్మనులును అదే విధంగా రష్యావారినిగురించి చెప్పిన మాటలను నమ్మవచ్చునా లేదా? జర్మనులు చాలాఅబద్ధాలుచెప్పేవారు అని అంటారు. జర్మనులు చెప్పినప్రకారం యిదివరలోనే సుమారు ౧౦ లక్షలవరకు రష్యను సైన్యాలను ఖైదీగా పట్టుకొన్నారు. ఇటీవలనే ౨౫ లక్షల వరకు రష్యను సైన్యాలను ఖైదీలను పట్టుకొన్నారు. సుమారు ౧౬౦౦౦ట్యాంకులను ధ్వంసముచేసినారు. ౧౮౪౦౦ రష్యా విమానాలను ధ్వంసం చేసినారు. అదేవిధంగా వేలకొలది తోపులను లాగుకొన్నారు. ఇదంతయుకూడాఅతిశయోక్తులతోను,పరిహాసోక్తులతోను నిండినముచ్చటయే యని స్పష్టము. ఎన్నిమోమారులు రష్యను బలముగిసిపోయింది అని జర్మనులంటూ వచ్చినారు. కాని యెప్పటివలెనే రష్యావారు బాగా ప్రతిఘటించుచునే వచ్చినారు.

ఈవిధంగా యుద్ధంనాటకం జరుగుతూఉంటే మధ్య ఒకచిన్న అంతర్నాటిక ఆడబడింది. అది ఈరాన్ నాటకం. ఈరాన్‌లో జర్మనుల కుట్ర చాలాఉండింది. సుమారు ౮౦౦ జర్మనులు చేరుకొని కుట్రలుచేస్తూఉండినారు. ఇదిఇంగ్లీషువారు గమనించి ఊరకుంటే ఇండియాకు ముప్పువస్తుందని ఈరానువారిని మందలించినారు. వారు తృప్తికరముగా వర్తించుకొనకపోయిరి. విధిలేక పాపము ఇంగ్లీషువారునురష్యావారును ఈరాన్‌పై యుద్ధం ప్రకటించవలసి వచ్చింది. యుద్ధముమాటకువస్తే ఈరాను ఏమిపని చేస్తుంది, దానికి ౧ లక్షసైన్యమే. విమానాలు ౧౦౦ వరకున్నవి. అవిన్నీ పాతకాలపు పుచ్చిపోయిన విమానాలు. రెండే దినాలలో వారు కత్తులుకిందవేసి దాసోహం అన్నారు. దేవునికైనా దెబ్బే గురువు. ఇరాఖువారెంతద్రోహం చేసినారో అంతకన్న తక్కువ ద్రోహం ఇరానువారు చేసిన వారుకారు. ఈరాన్ పాహాకు ఊపిరాడక ఎవ్వరికిన్ని చెప్పకుండా మూటముల్లె తీసుకొని పలాయనం చిత్తగించినాడు. ఇంగ్లీషువారు ముందేమేల్కొని యీ పని చేసింది చాలా మంచిదైంది. లేకుంటే హిట్లరు ఇండియాకే ముప్పు తెచ్చిపెట్టేవాడు. ఈకారణంచేత యిప్పుడు ఇండియాసరిహద్దు ఈరాను ఉత్తరములో కాస్పియాన్‌సముద్రంవద్ద ఉన్నదన్నమాట. ఇంకోదిక్కు ఇరాఖువద్ద ఉన్నది. మరోదిక్కు సూయజుకాలువద్ద. ఈమూడున్నూ ఇండియాకు యిప్పుడు యుద్ధపుగేట్లు అయియున్నవి—

ఇది యిట్లుండగా హిట్లరు ౧౦ దినాలక్రిందట నోరుతెరిచినాడు. ఏమేమో వాగినాడు. చూడు నా దెబ్బ అన్నాడు అతడెట్లావాగితే యేమి కాని అతనిసైన్యంవిజృంభించుచున్నదను విచారము మనకంతా కలుగుతుంది. ఇంతవరకు జర్మనుసైన్యం మాస్కోమీదికినడుస్తూఉన్నది. మాస్కోకు ౧౧౦ మైళ్లదూరంలోఉండే టులాపట్నాన్ని పట్టుకొన్నవి. ౧౫౦ మైళ్ళ దూరంలో ఉండే బ్రియాన్స్కుపట్నాన్నిముట్టడించినవి. ఆనగరాన్ని రష్యావారు వదలిపెట్టినారు. దక్షిణంలో క్రిమియా ప్రాంతపు అజోవు ప్రాంతములో రష్యా సేనానియగు బుడెన్నిసేనను తరిమివేసినామని చెప్పుకొంటున్నారు. మాస్కోకును కార్కోవునకు మధ్యనఉండిన రష్యాసేనానియగు తిమోషింకోను అతని సేననుచుట్టివేసినామని జర్మనులు ప్రగల్భాలుకొట్టుచున్నారు. ఇది ఎంతవరకు సత్యమోకాని కొన్ని ఇంగ్లాండుపత్రికలు "రష్యా అపాయ స్థితిలో ఉన్నది" అని వ్రాయుచున్నవి.

జర్మనులు శత్రువులను నాలుగు దిక్కులా ముట్టడించి చుట్టివేసేపద్ధతిలో ఘనులు. ఫ్రాన్సు, గ్రీసు, హాలెండు, బెల్జియం దేశాలలో ఇట్లే చేసియుండిరి. రష్యనులీపన్నాగాలనంతా ఎన్నటికైనా తమకు పనిపడుతుందను దూరదృష్టితో యిదివరకే గమనించుచూ వచ్చినారు. అందుచేత వారిని ఎన్నిమారులు జర్మనులు చుట్టివేసేదానికి ప్రయత్నంచేసినా ఇంతవరకు తప్పించుకొనిపోవుచునే వచ్చినారు. అట్లుతప్పించుకొంటూ వచ్చినను వారికి నష్టాలుబాగా కలిగినవి. యూరోపుఖండములోనెల్లను పెద్ద ఆనకట్టుయనియు పెద్ద విద్యుచ్ఛక్తి కేంద్రమనియు ప్రసిద్ధికన్న నీపర్ ఆనకట్టును రష్యావారు ధ్వంసంచేసుకోవలసివచ్చెను. ఈ ఆనకట్టును ౨౦,౦౦౦ మంది రాత్రింబగళ్లు ౬ ఏండ్లు కష్టపడికట్టియుండిరి. జర్మను రాక్షసులు దానిని సమీపించేవరకు ఒక గంటలో దానిని ధ్వంసంచేసివేసి రష్యావారు వెనుకకువెళ్ళిపోయిరి. తమకు నష్టమైనా జర్మనులకు ఏమిన్నీ లాభించకూడదని రష్యావారు తాము వదలిన ప్రదేశాలనంతయు నగరాలు, ఊర్లు,పంటలు, బాటలు, వారధులు, యంత్రాలు అన్ని కాల్చిమాడ్చి, ధ్వంసముచేసిపోయిరి. ఇది సామాన్యనష్టమా. మరల వీటినంతా స్థాపించుకోవలెనంటే ఎన్ని కోటానుకోట్లైనను చాలవు.

పైగా రష్యా దురదృష్టమనండి గ్రహచారమనండి దైవము రష్యాదేశాన్ని చాలావికారంగా కల్పించిపెట్టింది. దేశముచాలావిశాలమనిన్ని ఆస్ట్రేలియా ఖండమంత మూడంతలు ఉందనిన్నీ ఇండియా బర్మాచేరి ఎంతఉన్నదో అంత ౬ అంతలుందనిన్ని చెప్పడమేకాని జనసంఖ్యమాత్రం ౧౭ కోట్లుమాత్రమే. మరి సగము దేశము దట్టమగు అడవులు, ఎడతెగని మంచుతోనునిండి మనుష్యనివాసయోగ్యంకాకుండాఉంది. ఉత్తర దిశ పూర్తిగా మంచుసముద్రం. ఓడలు పోనేరవు. పశ్చిమసముద్రమగు బాల్టికులో ౧౦ మందినాయకులు. పైగా యీ పదిదేశాలకు హితముగావర్తించి రష్యా ఓడలు నడువవలసియుండును. తూర్పున వ్లాడివాస్టాకు అను ఒక ఓడరేవు. అది జపానుదగ్గర ఉండబట్టి జపానుబెదరింపునకు లోనైయున్నది. దక్షిణములోని బాల్కనుప్రాంత సముద్రమంతా తుర్కీమున్నగు దేశాలవశము. ఇక దేశములోని స్థితి. మంచిభాగమంతా యూక్రేన్‌మండలములోనే ఉన్నది. జనసంఖ్యలో సగముభాగము మాస్కో లెనిన్‌గ్రాడు కార్కోవు నగరాలకు పశ్చిమంలోనే నిండిపోయింది. యూక్రేన్ మండల ప్రాముఖ్యత ఇంతా అంతకాదు. అచ్చటనే గనులున్నవి. అందుచేతనే హిట్లరు స్వయంగా తనసైన్యాన్ని యీయూక్రేను మండలం మీదనే కేంద్రీకరించి ముప్పాతిక భాగాన్ని యింతవరకే గెలుచుకొనికూర్చున్నాడు. యూక్రేనులోని క్రివాయిరోగ్‌లోని ఇనుపగనులు, నికోపాల్‌లోని మంగనీసుగనులు, స్టెపోజర్ జింక్ జపరోజీ అనే ప్రదేశాలలోని లోహపు గనులు ఇవన్ని యిదివరకే హిట్లరు వశమైపోయినవి

ఖార్కోవులో మంచి నేలబొగ్గు గనులున్నవి. దానినిప్పుడు జర్మనుసైన్యము ముట్టడివేసింది. మొత్తంరష్యాలో ఎంతపంట పండునో అందులో సగం పంట యీయూక్రేన్‌లోనే పండును. అందుచేత దీనిని "యూరోపు ఖండము యొక్క గరిసె" అని యందురు. ఈ కారణముచేత రష్యావారు తమ పరిశ్రమలలో ముప్పాతిక భాగంవరకు ఈమండలంలోనే ఏర్పాటుచేసియుండిరి. ఈ యూక్రేన్‌లో మాత్రమే రష్యాలోని నేలబొగ్గులో ౬౦ పాళ్లున్నూ, ఇనుములో ౬౦ పాళ్లున్నూ, ౭౦ పాళ్లు వ్యవసాయం పనిముట్లున్ను, ౭౦ పాళ్ళు అల్యూమినమున్నూ, ౩౫ పాళ్ళు మాంగనీసున్నూ లభించుచున్నవి. యూక్రేనుకు దక్షిణములో రాస్టోవ్ పట్నమున్నది. దానికి గొట్టంద్వారా నూనె వచ్చును. దాన్ని జర్మనులు ముట్టడివేసినామంటున్నారు. దానికి ఇంకా దక్షిణంలో బాటూంపట్నమున్నది. దానికి బాకూ నుండి నూనెగొట్టంవస్తూఉన్నది.

## మందిరప్రవేశం - హుష్యార్!

సనాతనులకు హెచ్చరిక-

వంగపల్లి నీలకంఠం ఆనేఆతడు ఇంగ్లీషులో సంతకంచేసి ఉర్దూలోవార్తవ్రాయించి తెనుగు పత్రిక అగు గోలకొండకు ప్రచురణార్థమంపిన వార్తయేమనగా:—

కొన్ని స్థానిక పత్రికలలో ఆందుముఖ్యంగా ముఖ్యతరక్కీ గోలకొండపత్రికలలో ఇందూరులోనిసంస్కారములనున్న గుడివిషయాలనువ్రాసి నిజాంరాష్ట్రములోని జనుల భావాలను తమ కట్టుకిప్పుకొన మార్చుతున్నారు. సనాతనధర్ములు "ధార్మిక ఆయిదవకాలం" అనదగిన వారిచర్యలను ప్రతిఘటించుటకు యుద్ధసన్నద్ధులైయున్నారు. బ్రిటిషిండియాలో మందిరప్రవేశశాసనముప్రవేశపెట్టుచున్నారు కొందరు బ్రిటిషిండియానకలుచేయుట కలవాటుపడినారు, సనాతనులందరు మందిరప్రవేశ నిషేధమునకు విధము గానుండవలెను సనాతనధర్మాలకు అడ్డువచ్చువారికిమరొక మారు చెప్పుటయేమనగా వారు తమనింద్యమైన చేష్టలచే యీశాశ్వత రాజ్యములో అశాంతికలిగించకొందురుగాక.

## రాష్ట్రంలో చేపలవృద్ధి

హైద్రాబాదు రాష్ట్రంలో చేపలవృద్ధిచేయుటకై ఒక చేపలశాఖ ప్రత్యేకముగా స్థాపించుచున్నారు. దీనికిగాను ప్రత్యేకంగా శిక్షణపొందిన అధికారి నియుక్తుడగును. ఈశాఖపై ప్రభుత్వము వారు ఏటేట ౧౫౦౦౦ రూ॥ వ్యయంచేయుదురు ప్రథమంలో ౬౦౦౦ రూ॥ ఎక్కువగావ్యయింతురు, రాష్ట్రములోని నదులలో చెరువులలో ఉండేచేపలను గురించి విచారణచేయించినారు. ఇంకా బాగావృద్ధిఅయ్యేచేపలను తెప్పించి వాటిలో విడిపింతురు.

ఖమ్మం కలరా

ప్రభుత్వప్రకటనశాఖ వారిట్లు వ్రాయుచున్నారు. ఖమ్మంలో కలరావిషయమై పత్రికలలో ఎట్లంటే అట్లువ్రాసినారు. నిజంయేమంటే అర్ధిచేవాస్తుమండి అమర్దాదు ౧౫౫౦ వరకు మొత్తము ౧౭ మందికి కలరాకలిగింది. లోగనిలో ధానికై ౬౨౧౧ మందికి టీకాలుతీయబడెను. ౨౫ బావులలో మందుకలిపినారు, చుట్టుపట్టుగ్రామాలలో ౧౪౪ కేసులైనవి. డాక్టర్లు ౧౫౩౩ మందికి టీకాలుతీసినారు ౬౦ బావులలో మందుకలిపినారు ఇప్పుడీకలరాలేదు,

బాటూముకు జర్మనులువస్తే ఈరానుకు అపాయం. దానిమూలాన హిందూస్థానానికిన్నీ తప్పకుండా అపాయం కలుగుతుంది.

పాపం ఇంగ్లీషువారు భారమంతావహించి నాజీపిశాచాన్ని పారదోలే ఘనప్రయత్నాన్ని యీరెండేండ్లనుండి చేస్తూయున్నారు. ఇంగ్లాండువలె ఇండియామీద బాంబులుపడితే మనమాగగలమా? ఇంగ్లీషుజాతిలో పట్టుదల, ధైర్యం, ఐకమత్యం, క్షాత్రం ఉన్నందున వారు తట్టుకొన్నారు. పూర్వయుద్ధంలో ఎండన్ మూడుబాంబులు మద్రాను మీద విసిరేవరకుఅక్కడికథ చెప్పరాని భీభత్సముగా మారెనుకదా. దాన్నితలచుకొని జర్మనులే గెలిస్తే మన భావిగతి ఎట్లుండునోఊహించుకోనవలసినదే.ఐతే చర్చిల్ అమెరీగారు హిందూస్థానవిషయమై యేమిన్నీ ఔదార్యం చూపించకుండాఉన్నారు- లేకుంటే యింతవరకు భారతదేశము చేసిన సహాయంకన్న పదిరెట్లు ఎక్కువగా కావలసియుండెను. కాంగ్రెసును తృప్తిపరచకపోయిరి. పాకిస్థానును తృప్తిపరచకపోయిరి. ముస్లింలీగు కూడా అసంతృప్తిపొందింది. అందరికిన్నీ దేవుడు మంచిబుద్ధి యెన్నడు కలిగించునో యేమో? ఏదియెట్లున్నను, నాజీరాక్షసిని యేవిధముగానైనను తుదముట్టించుట అందరికిని ప్రథమ కర్తవ్యమై యుండును.

## హైదరాబాదు ధరలు

తేది ౧౦-౧-౫౧ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము ధరలన్నీ హాలీసి.

| వియ్యము | పల్లా ౧కి ధర |
|---|---|
| | రూ అ పై |
| కిచిడీసాంబర్లు | ౨౩ నుండి ౨౮౪ |
| సంబర్లు | ౨౩ ౦ ౦ |
| ఢిల్లీబోగాలు | ౨౨ ౬ ౦ |
| రాంసాగర్లు | ౨౦ ౬ ౦ |
| సావర్కాం | ౨౦ ౪ ౦ కొత్తవి |
| | ౨౨ ౦ ౦ పాతవి |
| అర్కాటి | ౨౧ ౬ ౦ ౨౧౪ కొత్తవి |
| ,, | ౨౨ ౬ ౦ పాతవి |
| కోహామణి | ౨౦ నుండి ౧౯౪వరకు |
| బుడుములు | ౧౩ ౦ ౦ |
| కేసరి | ౨౦ ౦ ౦ ౧౬వరకు |
| **గోధుమలు** | |
| సర్బతి | ౨౧ ౨౦౪ |
| బన్సీ | ౨౦ ౦ ౧౯౪ వరకు |
| అష్కీ | ౧౯ ౦ ౦ |
| పోటీయా | ౧౬ ౬ ౦ |
| ఎర్రగోధుమలు | ౧౮ ౬ ౦,౧౩ |
| **జొన్నలు** | |
| తెల్ల జొన్నలు | ౧౦౪ నుండి ౯౪ |
| పచ్చజొన్నలు | ౬ ౬ ౦ |
| సెనగలు | ౧౮౪ వరకే ౧౮౪దే |
| కందులు రెంరవి | ౯ ౬ ౦ |
| మినుము ల. | ౧౨ ౦ ౦ |
| అంకలు | ౧౮ ౪ ౦ |
| సజ్జలు | ౯ ౨ ౦ |
| **పప్పులు** | |
| సెనగపప్పు | ౨౩ ౦ ౦ |
| కంది ,, | ౧౮ ౬ ౦ |
| సిరిసెనగ, | ౨౧ ౨౨ ౬ ౦ |
| అంక ,, | ౧౬ ౧ ౦ |
| మినప ,, | ౧౬ ౦ ౦ ౧౩౪ |
| పెసర , | ౧౯ ౦ ౦ |
| బెల్లము | ౧౫ నుండి ౧౬ వరకు |
| ఉప్పు | ౧౨, ౧౧ ౬ ౦ |
| వుల్లిగడ్డ | ౧౨ నుండి౧౧నుండి౧౦ |
| వరుసు మొదటి ౨ సు.౧౨వరకు. ౩ ౨౬౦. | |
| చక్కెర మణుగు [౪౦ సేర్లు] | |
| జావా ,, ,, | ౧౪ ౦ ౦ |
| బొంబాయి ,, | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు ,, ,, | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర , పల్ల | ౧౩, నుండి ౧౫ వరకు |
| దర్గచక్కెర ,, ౪౦ సే. | ౧౮ ౧౨ ౦ |
| ఎల్లిగడ్డ మణుగు ౧౨ సే. | ౫ ౬ ౦ |
| అల్లం ,, ,, | ౬-౬-౦, ౫-౬-౦ |
| మణుగు ౧౨ సే. | |
| కొబ్బెరనూనె ,, | ౫ ౧ ౦ |
| కుసుమనూనె ,, | ౫ ౧ ౦ |
| నువ్వులనూనె ,, | ౪ ౦ ౦ |
| వేరుసెంగనూనె ,, | ౩ ౪ ౦ ౩ ౬ ౦ |
| కిరోసిన్ (గ్యాస్) ,,డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| **నెయ్యి** మణుగు ౪౦ సేర్లు | |
| విదరు నెయ్యి ,, | ౬౫ ౦ ౦ |
| తెలంగాణా ,, | ౫౫ ౦ ౦ ౫౯ |
| వనస్పతి డబ్బా ౧కి | ౧౧ ౬ ౦ |
| ఆముదాలు బస్తా ౯, | ౯ ౬ ౦ |
| వేరుసెనగ ,, | ౭ ౪ ౦ |
| పప్పు ,, | ౧౨ ౦ ౦ |
| బంగారు తు॥ ౧కి | ౫౦ ౪ ౦ |
| వెండి ౧౦౦ తు | ౩౨ ౬ ౦ |
| ,, తు ౧కి | ౦ ౧౧ ౬ |
| సవరన్ ౧కి హాలి రూ- | ౩౩ ౬ ౦ |
| **మారకం** | |
| హాలీకి కల్దార్లు | ౧౫ ౧౪ ౬ |
| కల్దారుకు హాలీలు | ౧౫ ౧౨ ౬ |

### బొంబాయి ధరలు

(అక్టోబరు ౧౩వ తేదిన)

| | రూ. అ. పై |
|---|---|
| బ్రోచిపత్తి (ఏప్రిల్-మేవాయిదా కంట్రాక్టు) | ౨౦౯-౪- |
| ఉమ్రాపత్తి (డిసంబరు-జనవరి వాయిదా) | ౧౮౩-౦- |
| ,, ,, (మార్చివాయిదా) | ౧౮౧-౦- |
| వెండి (తయారు) తులాలు ౧౦౦కి | ౬౨-౧౨- |
| ,, (నవంబరువాయిదా)తు.౧౦౦కి | ౬౨-౧౧- |
| ,, (డిసెంబరు ,, ) ,, ,, | ౬౨-౧౧- |
| బంగారు (తయారు) ,, ,, | ౪౨-౧- |
| ,, (నవంబరు వా॥) ,, ,, | ౪౨-౨- |
| ,, (డిసంబరు ) ,, ,, | ౪౨-౩- |

గమనిక:—

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము- అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకారు,

## "మంథెన గౌతమీ భజనమండలి" స్థాపనము

వెంటనే విధ్వంసనము

(ఓ.వి.) మంథెన అలాయెక

ఎక్కడలేని సౌకర్య మేమనగా, ఇక్కడ ఉన్న గ్రామస్థులందరు అందరు బ్రాహ్మణులేకాని లాభముపొందకున్నారు

ఇట్టివర్గములో వికమత్యము, పట్టుదల కలిగించుటకై, గ్రామోద్ధారకులైన కొందరు యువజనులు విద్యార్థులు గతసంవత్సరపు చైత్రమాసంలో బ్రాహ్మణవర్గసంఘమును నెలకొల్పబడిన పేరుతో స్థాపించిరి-దానినిర్వహించుటకు, ప్రతివీధి నుంచి ఇద్దరుప్రతినిధులు, మరివారిపై అధ్యక్షుడు, కార్యదర్శి ఈవిధముగ (౧౨)గురితో చేరిన ఒక కార్యనిర్వాహకవర్గము ఏర్పరచిరి. సభ్యులను చేర్చిరి. నెలకురూ (౧౦౦) చొప్పున ప్రోగుచేసి మొత్త సమకూడబెట్టినారు. ఈవర్గముయొక్క కష్టము లేక రక్షములనుతొలగించుటకు తగు సాధనోపాయములను నెరవేర్చు ఈ సంఘముయొక్క ముఖ్యోద్దేశముగ నుండెను.

కాని విచారకరమైన విషయ మేమనగా, ఇక్కడి ధనవంతులు, పెద్దలు మరివిద్యావంతులకల్ల ఎంతసహాయము మరిప్రయత్నము అతించినామో వానికి ఇబ్బందిగ మున్నలిగినది. విద్యార్థులు, వారి సొంతఊరికి వచ్చినప్పుడు దీనికై పాటుపడుచుండెడి వారు,ఈకార్యక్రమముగ ఈసంఘము దసరావాడు ఏర్పాటుచేసినసభకు పిలిచినను ఏవరు రాలేదు-ఎన్ను కొన్న మెంబర్లలో అభిప్రాయభేదము ఏర్పడెను. కొన్ని పైకము మొత్తము చెల్లాదరా రెండు-ఈవిధంగ ఒకసం॥ ములో ఈసంఘము నెలకూలెను.

ఇట్టిపరిస్థితులను మొదలేకనిపెట్టి విద్యార్థులందరు కలిసి శ్రీకళ్యాణ్ క్లబ్బు "మంథెనవారి క్లబ్బు" అని స్థాపించిరి. దీనిద్వారా యువజనులందరికీ, ఒకవిధమైన ఆటపై పు ఆకర్షించి, దానివ్యాయామమువలన శరీరపుష్టి కలిగించుటయేకాక అందరు ఒకచోట కలుసుకొనుటకు ఒక అవకాశమును చిక్కించిరి. ఉపన్యాసములు మొదలగువాటిచే వారికి ప్రపంచజ్ఞానపుష్టిని కూడ కలిగించి ఐకమత్యమునకు మార్గమేర్పరచిరి:

మళ్లీ ఈపడిపోయినసంఘమునకు పునర్జన్మమిచ్చవలెనన్న, గ్రామ్య్ణవర్గమంతయు, కష్టనష్టము లకు గురికాకుండ ఐకమత్యముప్రబలి, ఇతరగ్రామములలాగు ప్రఖ్యాతిచేయాలె చిన వెంటనేసంఘ సభ్యులేకాక ఇతరులందరు "క్లబ్బు"కు మెంబర్లుగా చేరుటం శ్రేయస్కరం.

## పెద్దిముల (చించోలీ తాలూకా)

(ఓ.వి.) ౮-౧౦-౪౧

ఈగ్రామానికి కొన్నిసంవత్సరముల క్రిందట చించోలీ తహసీల్ దారు (మౌల్వీ అమీరుద్దీన్) గారు వచ్చియుండిరి- వీరికి మామిడితోటలో డేరాలువేసి నివాసంచేసియుండిరి. వీరివంటచేసే మనిషి ఆతోటలోనుండి అనుజ్ఞ లేనిది మామిడి కాయలు తెంపి కూరగాయలలో వేసెను- భోజనం చేసేటప్పుడు తహసీల్ దారుగారు కూరగాయల లో మామిడికాయనుచూచి భోజనంవదలిపెట్టి విచారణజరిపి మామిడికాయల క్రయముఇచ్చి భోజనంచేసినారు-వీరికాలంలో పెట్టిచాకిరి మరియు బండ్లవారికి ప్రతిఫలంయిచ్చే ప్రయత్నం బాగుగావుండెనట.

ఈగ్రామంలో పరిశుభ్రతగురించి పట్వారిగారు చాలశ్రద్ధతీసుకొని పనిచేయుచున్నారు-గ్రామంలో మరుగుదొడ్లులేక స్త్రీలకు బహిర్భూమికి వెళ్ళవలెనంటే చాలకష్టంగానుండి- చించోలి తాలూకాకేంద్రమునుండి పశువైద్యునికై డాక్టర్ గారువచ్చి బసచేసి పశువులను పరీక్షించుచున్నారు.

## కాదిలాబాదు చౌర్య ధనము

కాదిలాబాదు అందోలు తాలూకాలోనిది విక్రమ సంవత్సర మైశాఖ ౮కి గారోజున మైత్రగ్రామనివాసియగు గుర్రేటి విశ్వనాథము అనువారు గ్రామాంతరమేగిన సమయమున వారియింట దొంగలుప్రవేశించి, ఇంటివారి పొరపాటుచే వాడు తాళముతీయక విడువబడిన యినుపపెట్టెనుండి నెయ్యిరూపాయిలు మొత్తముగల రెండుపంచులనపహరించిరి. దీనివిషయమున పోలీసుమంత్రిజంగారయిన సరదార్ ౼లీ బేగుగారు పరిశోధించి వహబుద్దీన్ అనువానిని బంధించిరి, వానివద్ద కొంతధనమును గుర్రేటి విశ్వనాథముగారి చేవ్రాలుగలయొక పత్రమును దొరికినది, ముంత్రిజంగారింకనువిచారించుచున్నారు, చోరుడుఅపహరించినదానిలో కొంతధనమువ్యయముచేసి బట్టలు, వెండి, బంగారము, మున్నగు దానిని కొనినట్లు తెలియుచున్నది.

## ప్రకటన

మ. ఘ. వ. నిజాం ప్రభుత్వమువారి కోర్టుఆఫ్వార్డ్సు నిగరానిలో యున్నవనపర్తి సంస్థాన డివిజన్ కార్యాలయము నుండి యిందుమూలముగా తెలియపరచుట యేమనగా వనపర్తి సంస్థానములో చేరినరాజనగర్ జాతర ౧౩౫౦ ఆజూర్ ౧౬౪౯ ఫ నుండి ప్రారంభమగును. రాజానగరుకు సమీపములో యుండిన సంస్థానమునకు సంబంధించిన యితర గ్రామములలోను ప్రభుత్వమువారిక్రింది గ్రామములలో కలరావ్యాపించి యున్నందున రాజానగరు జాతర యీసంవత్సరము స్థానికముగా మాత్రమే జరుపబడును. కనుక యితర యాత్రికులు అచటికిపోవు శ్రమతీసికొనకుందురుగాక.

అజీజ్ అహమద్
వనపర్తి సంస్థాన డివిజన్ ఆఫీసర్.



## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీము.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారు 1946 సంవత్సరపు 3o/o డిఫెన్సు బాండ్లు ప్రకటింపబడినరేటుప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తాముబాండ్లుకోరిన మొత్తములో ప్రతిశతి 5 వంతు ముందుగా చెల్లింపవలయును. రు. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును.

(3) తరువాత బాండ్ల మొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును. మొదటి మూడు నెలలవరకు ప్రతిశతి 5 గాని అంతకెక్కువగాని చెల్లింపవలయును, మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్ని వాయిదాలను సారముచెల్లింపవలయును.

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపడిన కిస్తుమొత్తములపై బ్యాంకువారు నూటికి 2 1/2 వంతున వడ్డియిచ్చెదరు.

(5) పూర్తిమొత్తముచెల్లించిన తరువాతి బాండ్లుయివ్వబడును.

(6) బాండుమొత్తముపూర్తిగా చెల్లించినతరువాత ప్రతిశతి 2 1/2 వడ్డీఆగిపోయి, బాండుదియివ్వబడినతేనుండి సరియైనవడ్డి చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తిమొత్తమును చెల్లించకముందే అక్కరవచ్చినయెడల బ్యాంకువారు దానిని మార్కెటురేటుప్రకారము ఏమియు తక్కువ లేకుండ సెలయిచ్చి దానిపైయింకా చెల్లించవలసినపైకమును పట్టుకొని మిగతపైకమునిత్తురు.

హైదరాబాదు-దక్కను 28—8—40

మేనేజరు.
కె. జె.. వికాజీ

# విదేశముల విశేషాలు

### బ్రిటిషు ప్రభుత్వమునకు ఫిన్లెండు సమాధానము

ఫిన్లెండుప్రభుత్వమునకు బ్రిటిషు ప్రభుత్వము వారు సెప్టెంబరు ౨౭వ తేదిన పంపిన హెచ్చరికకు ఫిన్లెండు ప్రభుత్వము జవాబిచ్చుచు, రష్యాతో తాను చేయుచున్న యుద్ధము ఆత్మరక్షణార్థమే యని తెలిపినది-౧౯౩౯ నవంబరు ఆఖరున రష్యా వారు ఫిన్లెండుపై అకారణంగా దండెత్తి, ఫిన్లెండు రాజ్యభాగము ను ఆక్రమించుకొన్న సంగతి జ్ఞాపకము చేసి, ఫిన్లెండుప్రభుత్వమువారు ఈ సంవత్సరము జూన్ ౨౨వ తేదిన రష్యా సేనలు ఫిన్లెండుపై యుద్ధచర్యలుజరిపినట్లును, అప్పటికిని జూలై ప్రారంభములో గాని తాము యుద్ధములో దిగనట్లును తెలిపినారు-౧౯౩౯సం||పు ఫిన్లెండు పరిహద్దులోని ముఖ్యభాగములు ఇంకను శత్రురాజ్యము లోనున్నవి. అవియు, ఇపుడు యుద్ధములో ఫిన్లెండు సేనలు నడిచిచేరిన భాగములును పూర్వము ఫిన్లెండుపై దండయాత్రకు మూలస్థానములుగా వినియోగించబడినవి- ఈభాగములవరకు సరిహద్దును మార్చినగాని ఫిన్లెండుకు గట్టిరక్షణయుండదనియు, అక్కడి ప్రజలుఫిన్నులనియు ఫిన్లెండు ప్రభుత్వము బ్రిటనుకు తెలిపినది

### అమెరికా తాటస్థ్య శాసనపు మార్పునకై యత్నము

అమెరికా అధ్యక్షుడు రూజ్వెల్టుగారు జర్మనులు అమెరికావారినౌకలపై దెబ్బలుతీయుచున్నందువల్ల వాటిరక్షణకై ఆనౌకలపై ఆయుధముల నమర్చవీలగునట్లును, బ్రిటిషువారికిని వారిమిత్రులకును అమెరికానుండి యుద్ధసామగ్రిని అమెరికా నౌకలలోనే పంపించుటకును వీలగునట్లుగా అమెరికా తాటస్థ్య శాసనమును సవరించుటకై అక్టోబరు౭వ తేదిన అమెరికాప్రభుత్వ నాయకులతో ౨½గంటలకాలము చర్చించినతర్వాత శ్రీసవరణచేయవలసినదని అమెరికా శాసనసభయగు కాంగ్రెసుకు అక్టోబరు౯వ తేదిన సందేశమునంపిరి. ఆసందేశములో అమెరికా వాణిజ్య నౌకలయందు ఆయుధముల నమర్చరాదను నిషేధమును రద్దుచేయవలసినదనికోరిరి, అమెరికావారి నౌకలు మిత్రమండలివారలరేవులకు వెళ్లవీలు లేనిచో అమిత్రులకు సహాయముచేయవీలుండదనికూడ ఆ సందేశములో చెప్పినారు- తాటస్థ్యశాసనము ఒకానొకసమయమున అవసరముగా నుండెనుకాని ఇపుడదిఅవసరమని ఆసందేశములో చెప్పినారు, ఆసందేశానుసారము చేయవలసిన సవరణలు శాసనసభయుభయశాఖలగు సెనేటులోను, ప్రజాప్రతినిధులసభలోను కూడ ప్రతిపాదించ బడినవి

### అమెరికాలో సమ్మెల ఫలితము

అమెరికాలో యుద్ధావసరవస్తువులను, నౌకలనుఉత్పత్తి చేయు పరిశ్రమలలోపనివారలసమ్మెలుజరుగుట తనకిష్టములేదనుచు "హిట్లరుజలాంతర్గాములు బ్రిటిషువారిఓడలను విశేషముగా ముంచుచున్నవి. ముంచబడినంత శీఘ్రముగా ఓడల నిర్మాణము జరుగుటలేదు- ఇటీవల అట్లాంటిక్ యుద్ధము బ్రిటనుకు అనుకూలముగా పరిణమించు సూచనలుకలవు. వినను బ్రిటనుకు నూతనౌకావలసియున్నది-ఈనూతనౌకలలోనే అమెరికానౌకలలోనే పంపవలసియున్నది" అని అమెరికాప్రభుత్వనౌకాశాఖమంత్రియగు కల్నల్ నాక్సు అమెరికాలోచికాగోరాష్ట్రమందుజరిగిన "నేషనల్ సేఫ్టీకాంగ్రెసు" అనుసభకు పంపినసందేశములో తెలిపిరి. "ప్రస్తుతము దూరప్రాచ్యమునైనను, బ్రిటీషు ద్వీపములపైనదండెత్తుట హిట్లరుకువీలుకాదు-కాని అతడు సిద్ధముకాగానే దండయాత్రలు తప్పకజరుగును-అమెరికాను జయించుటకుకూడ హిట్లరు సంకల్పించియున్నాడు,

### "నేషనల్ ఫారిన్ ట్రేడ్ కన్వెన్షను" సభ

వైపేయతోఒకసభ అమెరికాలోని న్యూయార్కు నగరంలో అక్టోబరు౮వ తేదిజరిగినది. ఆసభయొక్క ఉద్దేశ్యములను, ప్రయోజనములను గురించి తెలిసికొనుటకు ఆ సభకు రూజ్వెల్టుగారును చర్చిల్ గారునుపంపిన సందేశములును, ఆసభలో హాలిఫాక్సు ప్రభువుగారిచ్చిన ఉపన్యాసములును సహకారులుగానుండగలవు, రూజ్వెల్టుగారు పంపిన సందేశములో "విదేశాలతో జరుగవలసిన వ్యాపారము సవ్యముగాను,న్యాయముగాను, పరస్పరశ్రేయస్కరముగాను జరుగునట్లు చూడవలెను-యుద్ధానంతరము వ్యక్తుల స్వాతంత్ర్యోత్సాహాభినివేశములకు అవకాశములొసంగురాజ్యాంగవ్యవస్థలు ఏర్పడునట్లును, తిరిగి యీప్రపంచములో యుద్ధాలకవకాశమే లేని స్థిరమైనశాంతి ఏర్పడునట్లును ఇప్పటినుండియేఆలోచించుచుండవలెను" అనికోరిరి. చర్చిల్ గారు పంపిన సందేశములో ఈసమావేశములోని ఆలోచనలవల్ల మున్ముందు ఎక్కువప్రశస్తతరముగానుండునట్టి నూతన వ్యవస్థ నిర్ణయింపబడునని ఆశించుచున్నాననిరి హాలిఫాక్సుప్రభువుగారుపన్యసించుచు అమెరికా సంయుక్తరాజ్యమున్ను, బ్రిటిషుసామ్రాజ్యములోని దేశములును, ఇతరస్వతంత్రజాతులుకలిసి ఆలోచించి శిథిలమైన అంతర్జాతీయవ్యాపారమును బాగుచేయుటకు పూనుకొనవలెనని చెప్పిరి-ఈసభ వారు అమెరికా వాణిజ్య నౌకలపై ఆయుధముల నమర్చునట్లును అమెరికా నౌకలు ఎక్కడికైనను నిరాక్షేపముగాపోవుటకు వీలగునట్లును తాటస్థ్య శాసనమును సవరించవలెనను తీర్మానము నామోదించినారు.

### ఉత్తర ఈరానుపై రష్యాదృష్టి యనునది వదంతియే

ఈరానులో ఉత్తరప్రాంతములను రష్యాలో చేర్చుకొనుట కంగీకరించవలెనని రష్యావారుకోరినట్లు శత్రువులు వదంతులను వ్యాపింపజేయుచున్నారు. అవద నితులుఅసత్యములని రష్యా అధికారులు ఖండన చేసినారు.

### తుర్కీ- జర్మనీల ఒడంబడిక

తుర్కీ-జర్మనీదేశములకు ఒక వాణిజ్యపు ఒడంబడిక కుదిరినట్లును. ఒడంబడికపత్రముపై అక్టోబరు ౯వ తేదిమధ్యాహ్నము ఉభయపక్షాలవారి సంతకములైనట్లును ఒక న్యూస్ ఏజన్సీ తెలిపినది. క్రోము విషయంలో తుర్కీ-షరతులసవరణలను కొన్నిటిని జర్మనులు అంగీకరించినట్లు తెలియుచున్నది ఈ క్రొత్తసవరణప్రకారము తుర్కీ-వారు ౧౯౪౩. ౧౯౪౪వసంవత్సరములలో సంవత్సరమున౯ టా వేలటన్నులక్రోమును జర్మనులకుఅమ్ముటకు ఒప్పుకొనినారు-జర్మనీతుర్కీ-కి ఒకకోటి ఁ౦లక్షల తుర్కీ-పౌనులవిలువగల యుద్ధసామగ్రిని ౧౯౪౩ వసంవత్సరములోగా పంపించినట్లయితేనే తుర్కీ-వారు జర్మనీకి క్రోమునుపంపిరని షరతుపెట్టబడినది-ఈఒడంబడిక౧౯౪౩మార్చి౩౧తారీఖువరకు అమలుజరుగునట్లున్నది-అంతకాలములోగా ౨౦ కోట్లజర్మన్ రీష్ మార్కు-ల విలువచేరను ఒకదేశము నుండిసామానులు ఇంకొకదేశమునకు పంపబడవలసియుండును-తుర్కీ-కి ముఖ్యముగా కావలసిన ఇనుము ఉక్కు-పరిశ్రమల కవసరములైన సామానులును, యుద్ధసామగ్రియును పంపుటకు జర్మనీ అంగీకరించినది- ఇందుకుబదులుగా తుర్కీ-వారు జర్మనీకిముడిపదార్థములు, ఆహార పదార్థములు, దూదిపొగాకు,అలివ్ నూనె ఖనిజములుపంపగలరు.

### పోలిషు ప్రభుత్వముతో జపాను మైత్రిచ్ఛేదము

జపాను ప్రభుత్వమువారు ఇపుడు లండనులో ఉండే పోలిషుప్రభుత్వమువద్దనుండు తమ రాయబారిని రప్పించుకొనుటకును జపానులోఉండే పోలిషు రాయబారకార్యాలయమును మూసివేయుటకును నిర్ణయించుకొన్నారు-ఇది ఆప్రభుత్వముతో మైత్రిచ్ఛేదమునకు గుర్తు

### అబిసీనియా చక్రవర్తి సొంతసేన

అబిసీనియాచక్రవర్తి సొంతసేన నేర్పరచ గోరగా బ్రిటిషువారు ఆసేనకు తరిఫీదు చేయుటకై ఒకమిలిటరీ సాయబోగులవద్దకు పంపుచున్నారు

### భారతదేశపు ఆశయము- బ్రిటనుకు ఒక ఆంగ్లపత్రిక ప్రాత సంపాదకుని హెచ్చరిక

ఇదివరకు భారతప్రభుత్వపు ఆర్థికమంత్రిగనుండి చాలించుకొనిపోయిన సర్ జార్జిషుస్టర్ గారు భారతదేశమును గూర్చి ఒకగ్రంథమును ఇంగ్లీషులోవ్రాసినారు, దానినిగురించిచిఇదివరలో డెయిలీ హెరాల్డుపత్రికకుసంపాదకుడుగనుండిన విలియం మెల్లర్ గారు విమర్శవ్రాసినారు- భారతదేశములో ప్రజాస్వామ్యవిధానమును ప్రవేశపెట్టుటకు సమయము వచ్చినదిగాని భారతీయులు తమలో తాము కలహించుకొనుచుండుట ఆటంకముగానున్నదని అధికారులందరును చెప్పెడి అభిప్రాయమే ఈపుస్తకములోనున్నదని విలియం మెల్లరుగారు ఈక్రిందివిధముగా వ్రాసినారు.-

"౧౯౧౯నుండి ప్రపంచములో ఎంతవేగముతో సంగతులుజరిగినదియు షుస్టర్ గారెరుగుదురుగాని వారికిఅదియిష్టముకాదు భారతదేశముకూడవృద్ధిపొందినది, స్వాతంత్ర్యముకావలెనను సంకల్పము సామాన్యభారతీయులలో హృదయగతమైనదికాదనిచెప్పి త్రోసివేయుటవల్ల ప్రయోజనములేదు- నేడుమనము (అనగా,బ్రిటిషువారు) భారతదేశము తనభవిష్యత్తును తానే నిర్ణయించుకొనవలెనని కాంగ్రెసుమాత్రమే గాక ఇతరులును కోరుచున్నకోరికను తీర్చవలెను. లేనిచో దేశమంతటను తిరుగుబాటురాకతప్పదు. దానినుండిప్రపంచములోని జెన్నాలందరుకలిసినను రక్షించజాలరు, అమెరికాయును చర్చిల్ గారును అట్లాంటిక్ ఒడలబడికలోని సూత్రములను, హిట్లరు పద్ధతి కూలద్రోయబడినతర్వాత భారతదేశమునకు వర్తింపచేయుటకు నిజముగ తాము సంసిద్ధులమైయున్నమంపండిత నెహ్రూగారికి నమ్మకము కలిగించగలిగినచో, యుద్ధసమయపు సమాధానమునకు అవకాశముండవచ్చును. కాన్గ్రెసువారలు అవసరము, నిర్బంధములుకావు జైళ్ళనుండి ఖైదీలనువదలవలెను- కాంగ్రెసుకు బలముకలదనిఒప్పుకొనవలెను. ఎదురుతిరిగిన ముసల్మానులకు మనముసహాయముచేయబోమని తెలియునట్లుచేయవలెను. సంస్థానాధీశులు తామేదియు ఆటంకపెట్టజాలమని గ్రహించగలుగునట్లుచేయవలెను."

చందా వివరము

౧ సంవత్సరమునకు రు 6
౨ మాసములకు రు ౩
(బ్రిటిషిండియాలో
సంవత్సరం చందా
౧-౮-౦ ఎక్కువ)
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

THE ONLY
POPULAR PAPER
THAT REACHES
The masses
in the Dominions
* * *
BEST MEDIUM
for
Advertisement.

Volume 16 | Hyderabad-Dn | Thursday 16th October 1941 | Number 46




## కూచిపూడి భరతము

శ్రీ తాండవకృష్ణ, ఎం.ఏ.,
మరియు
శ్రీ జగన్నాథ శర్మ.

ఆదివారం ౧౨ అక్టోబరు నాడు సికింద్రాబాదులో అలెగ్జాండ్రా రోడ్డులోని ప్యాలెట్ హెడ్ క్వార్టరు జిల్లా మేజిస్ట్రేటు గారి అధ్యక్షతలో శ్రీ తాండవకృష్ణ గారున్నూ శర్మ గారున్నూ కూచిపూడి భరతనృత్యమును ప్రదర్శించిరి- గొప్పగొప్పవారు హిందూముస్లిం క్రైస్తవులున్నూ ప్రేక్షకులలో నుండిరి. ప్రేక్షకులు నృత్యముచూచి ముగ్ధులైపోయిరి తాండవకృష్ణ గారి అద్భుత నాట్యాన్ని శర్మ గారి సుకుమారమైనందరమైనఅభినయాన్ని సభ్యులు చూచి చాలాఆనందించిరి శ్రీ తాండవకృష్ణ గారును వారి అనుయాయులును ఇంకను రెండుమూడు ప్రదర్శనాలను సికింద్రాబాదు హైద్రాబాదు నగరాలలో ప్రదర్శింప నున్నారని వినుచున్నాము.

## బలిగుడుఆట పోటీ

శ్రీరాజాబహద్దరు వెంకటరామారెడ్డి గారిప్రశంస [illegible]

(స్వ- వి-)

హైద్రాబాదు-దక్కను నగరమందు సుల్తానుబజారులో హనుమాన్ వ్యాయామశాల యందు అక్టోబరు ౧౧ వతేదిన శ్రీ రాజాబహదర్ వెంకటరామారెడ్డి ఓ-బి-ఇ. గారి అధ్యక్షతన కాచిగూడెపుమహాకాళి తాలీముఖానా (బలిగుడు) మండలి మూడవతరగతి బాలురతో బలిగుడు ఆట పోటీలో కడపటి ఆట జరిగెను. కాచిగూడెపు మహాకాళి తాలీముఖానా మండలివారలు గెలుపొందిరి- శ్రీ రాజాబహదర్ వెంకటరామారెడ్డి గారు గెలుపొందిన బాలురకు ఆటను మెచ్చుకొని సుమారు రూ ౨ ౦ విలగల కప్పునుబహుమానముగా నిచ్చిరి,

---

మొదటికాలం తర్వాత

అనువిమర్శించి తత్ఫలితముగ పలుగ్రంథములు వ్రాసి యాంధ్రలోకమునకెంతయు నుపకారులైరి. ఇంకను ఇట్టివిజ్ఞానదాయకములగు పరిశ్రమలు చేయుటకై భగవంతుడు శ్రీ శాస్త్రిగారికి సంపూర్ణాయురారోగ్యములనిచ్చుగాకయని ప్రార్థించుచున్నాము,

## ఆంధ్రోపన్యాసములు

(స్వ.వి.)

ఈనెల ౯-౧౦-౧౧(౧౩౫౦) తేదీలలో హైదరాబాదునగరమందు కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయమున, పండితులును, విమర్శకచూడామణులును, పీఠికాపురరాజాస్థానవిద్వాంసులునగు, శ్రీ వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే నుపన్యాసములీయబడెను. మొదటిరోజున "ఆంధ్రుల విజ్ఞానము" అనువిషయమునుద్దేశించి యుపన్యసించుచు, వేదకాలమునుండియు నాంధ్రజాతి పేరు ప్రతిష్ఠలనెల్లొందెననియు, విశ్వామిత్ర మహర్షి యాంధ్రజాతికి పితయనియు, ఆపస్తంబమహర్షి యాంధ్రజాతికి శిరోభూషణమనియు, ఆతడురచించినసూత్రములనుపరిశీలించినచో, ఆంధ్రులవిజ్ఞానమెంతటిదో తెలియగలదనిరి. మరియు ఆతనిసూత్రములలో నాకానిర్మాణము, ఖగోళవిషయము, నిష్కర్షయము మున్నగువానినిగూర్చి యెంతేనికలవనియు నవిమర్శముగనిరూపించిరి. జాతికిసభముగిసెను. రెండవరోజున మహాభారతమునుగూర్చియుపన్యసించిరి మహాభారత మొకట-వ్యాసునిచేతమాత్రమే రచింపబడలేదనియు, వ్యాసునివిదప క్రీస్త్వనంతరము 3 వ శతాబ్దపర్యంతమును విశేషభాగములు చేర్చబడినవనియు నవీనవిమర్శకములచే సిద్ధాంతీకరించిరి. నాడు ౧౨ గంటలకు సభముగిసెను- మూడవరోజు "కవిత్రయభారతము" అనుదానిపై సుమారు ౨౺ గంటలుపన్యసింపబడెను. నన్నయయువిశేషముగస్తుతించిరి. తిక్కన్న వ్రాసిన విరాటపర్వ ద్వితీయాశ్వాసభాగము మిక్కిలిగొప్పదనియు, ఆనౌచిత్య దోషమున్నదనియుచెప్పిరి- ఏలయన సైరంధ్రీపర్వము కీచకుడుపొందిన మోహావేశము (ఆమూలకముగుదానిని) తిక్కన్న యతివేలముగ వర్ణించినాడనియు, ఈవిషయమున మూలమున లేమియు కొంత గాదనియు ఇది తిక్కన్న చేసిన రహాళాసమనియు, సైరంధ్రీవేషమున నున్న ద్రౌపదియు ప్పటికి ౭ ఏండ్లుగల "బాల" మనియు, ఇట్టిమనుపలిపై నతికామమును వర్ణించుట, అందునుమూలమునలేనిదానినికల్పించి వర్ణించుట యనౌచిత్యమనియు ఖడించిరి. సభముగిసెను సభాంతమున శ్రీ శాస్త్రిగారిని గౌరవింపదలచి కొందరాంధ్రసోదరులు శాస్త్రిగారిపైనున్యాసములను, విమర్శనాదృష్టిని మెచ్చి సంతోషించి రూ-విలయగు ఉపాస్యతులగు ఇ-నీతా రామారావు గారిచే సమర్పింపజేసిరి

శ్రీ శాస్త్రిగారు బహుశాస్త్ర గ్రంథవిమర్శకులు, వేదవిశారదులును చేసినవారు [illegible]




Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A. B. L.